# యథార్థబోధిని



mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక
విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

ఓమ్

శ్రీ మళయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

# యథార్థ బోధిని

కూర్పరి

శ్రీ చిన్మయ రామదాసు


శ్రీ [illegible]క్త్యాశ్రమము. తాడేపల్లి ( P. O. )

వయా కొడాలి - మొవ్వ తాలూకా

( కృష్ణా జిల్లా )

ఓమ్

శ్రీ మలయాళ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ గణేశాయనమః శ్రీ శారదామాత్రే నమః

# యథార్థ బోధిని

కం. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకులతోటి నెయ్యమును
నితాంతాపార భూతదయయును
తాపసమందార మాకు దయసేయగదే।

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరం బనిసేయు హస్తయుగముం నీ మూర్తిపైఁ జూపులున్
నీ పాదంబులపొంత మ్రొక్కు శిరమున్ నీ సేవపై జిత్తమున్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!

మంచి నడత నిమ్ము, మంచి గుణము నిమ్ము
మరణభయములేని మనసు నిమ్ము
మాయ భ్రమలు లేని మార్గంబు నిమ్మురా
ధరను చిన్మయ రామదాసపోష ॥

## సు భా షి త ము లు

1) సత్యధర్మాచరణలకు వేరుగా సద్గ్రంథ పఠన ఫలము లేదు.

2) సుఖ దుఃఖములకు వేరుగా పుణ్య పాపకర్మల ఫలితములు లేవు.

3) స్వార్థ రహిత బుద్ధికి వేరుగా లోకోపకారము లేదు.

4) స్వార్థ సహిత బుద్ధికి వేరుగా దేశాపకారము లేదు.

5) నిరాశకు వేరుగా సన్న్యాసము లేదు.

6) ఆశకు వేరుగా సంసారము లేదు.

7) సమదృష్టికి వేరుగా జ్ఞానము లేదు.

8) భేదదృష్టికి వేరుగా అజ్ఞానము లేదు.

9) నిరహంకారమునకు వేరుగా మోక్షము లేదు.

10) అహంకారమునకు వేరుగా బంధము లేదు.

11) మనోసంకల్పములకు వేరుగా జగము లేదు.

12) మనశ్శుద్ధికి వేరుగా ఆత్మ సుఖము లేదు.

13) మనోనిగ్రహమునకు వేరుగా ఉత్తమ తపస్సు లేదు.

14) పరమాత్మను మరువకుండుట కంటె వేరుగా గొప్ప మహిమ లేదు.

15) కలిమిలేముల యొక్కయు, సుఖదుఃఖముల యొక్కయు, సత్యాసత్యముల యొక్కయు నిజతత్త్వమును నిర్ణయించుకొనుటకంటె వేరుగా దేశాటన ఫలితము లేదు.

16) కర్మదోషమును నివారణ జేసికొనుటకంటె వేరుగా పుట్టుక ఫలితము లేదు.

"క్షుధితస్య చ భోజనమ్."

ఆకలితో నున్నవారికి ఆహారమును పెట్టవలెను

"భీతేభ్యశ్చాఽభయం దేయమ్."

భయముతో నున్నవారికి అభయ మొసంగవలెను

"వ్యాధితేభ్య స్త దౌషధమ్."

రోగులకు ఔషధము నియ్యావలెను.

"దేయా విద్యార్థినాం విద్యా."

విద్యను కోరువారికి విద్యను (వేదాంత విద్యాద లను) నేర్పవలెను.

"పరాపవాద పరిహారం కుర్యాత్
పారుష్యంచానృత మపి మావద."

పరులను నిందించకుము. కఠినముగాను, అసత్యవ గాను మాట్లాడకుము.

"పరోపకారార్థ మిదం శరీరం తస్మాత్."

మనశరీరము మానవాది జీవులకు ఉపకారము (సేవ) చేయుట కొరకే వచ్చినది. అందువలన.

"దేయ మార్తస్య శయనమ్."

రోగులకు, వృద్ధులకు పరుండుటకు వసతిని ఇచ్చు చుండవలెను.

"పరిశ్రాంతస్య వాసనమ్."

కష్టపడుచుండువారికి కూర్చొనుటకు వసతిని ఏర్పాటు చేయవలెను.

"తృషితస్య చ పానీయమ్."

దప్పికతోనున్న వారికి త్రాగుటకు జలము నియ్యవలెను.

## లోకము తీరు

శ్లో. సర్వానపి చ సంతోష్య అశక్తాః కార్యసాధనే
సాత్వికోఽశక్త ఇత్యేవ శాంతో భీరుక ఇత్యపి
మానీతు మూక ఇత్యేవం వక్తా వాచాల ఇత్యపి
విరాగీ చ దయా శూన్య ఇత్యేవం నింద్య తేజనైః ॥

శా. అందరిని తృప్తిపరప ఎవ్వరును ఏ కార్యమును చేయజాలరు. సాత్త్వికుడుగా యున్నచో చేతకానివాడనియు, శాంతుడుగా నున్నచో పిరికివాడనియు, మౌనముగా నున్నచో మూగవాడనియు బాగుగ మాటలాడినచో వదరబోతు యనియు వైరాగ్యవంతుడై యున్నచో దయలేనివాడనియును లోకజనులు దూషించుచున్నారు. (కనుక లోకమును ఎవ్వరును మెప్పించలేరని తెలియవలెను.)

సత్యాసందీయము

## నిజమైన చూపు యేది ?

లోకమును, సంసారమును (అనగా నాను రూప క్రియలను) కామముతో గాని, క్రోధముతో గాని, మమకారముతో గాని, ఆశతో గాని, భయముతో గాని, అసూయతో గాని, అహంకారముతో గాని, ఈర్ష్యతో గాని, సంతోషముతో గాని, దుఃఖముతో గాని చూచుచుండుట నిజమైన చూపుగాదు. అఖండప్రేమతో

నిస్వార్థ దృష్టితో, పరమాత్మతో, పరబ్రహ్మానందముతో జూచుచుండుటయే నిజమైన చూపు యగును

## నే నెవరిని ?

1) మంచిపనులను చేయుచున్నపుడు నీవు సజ్జనుడవు.

2) చెడ్డపనులను చేయుచున్నపుడు నీవు దుష్టుడవు.

3) కనబడే రూపములపైని; వినబడే శబ్దములపైని, పనులపైని ఇచ్ఛ, ద్వేషము లుండునపుడు నీవు సంసారివి.

4) నామ రూప క్రియలపై రాగ ద్వేషములు నశించినపుడు నీవు సన్న్యాసివి.

5) సర్వమును దేవునిదిగా నిశ్చయించి అన్ని పనులను దైవార్పణము చేయుచు సర్వదా దేవుని స్మరించుచున్నంత వరకును నీవు భక్తుడవు.

6) మనోసంకల్పములను అరికట్టుచున్నపుడు నీవు యోగివి.

7) నీవు కామముతో నున్నపుడు కామమే నీవు.

8) నీవు క్రోధముతో నున్నపుడు క్రోధమే నీవు.

9) నీవు భయముతో నున్నపుడు భయమే నీవు.

10) నీవు అహంకారముతో నున్నపుడు అహంకారమే నీవు.

11) నీవు మమకారముతో నున్నపుడు మమకారమే నీవు.

12) నీవు సంతోషముతో నున్నపుడు సుఖమే నీవు.

13) నీవు దుఃఖముతో నున్నపుడు దుఃఖమే నీవు.

14) నీవు దైవభావములో మునిగియున్నపుడు దైవమే నీవు.

15) నీవు ఆత్మభావముతో నున్నపుడు ఆత్మయే నీవు.

16) నీలో మల విక్షేప ఆవరణలు నశించినపుడు సాక్షాత్తుగా పరబ్రహ్మ స్వరూపమే నీవు

## నా నిజస్వరూప మేది ?

నీవు స్త్రీవి కావు, పురుషుడవు కావు. దరిద్రుడవు కావు. ధనవంతుడవు కావు. నీవు సంసారివి కావు, సన్న్యాసివి కావు, నీవు మంచివాడవు కావు, చెడ్డవాడవు కావు, నీవు సుఖివి కావు. దుఃఖివి కావు, నీవు పామరుడవు కావు, పండితుడవు కావు, నీవు యజమానివి కావు. నౌకరివి కావు, నీవు శాంతుడవు కావు. క్రోధివి కావు. నీవు పిరికివాడవు కావు, ధైర్యశాలివి కావు. నీవు శరీరము, ప్రాణము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అజ్ఞానమును కావు. నీవు నిజముగా ఎవరి వనగా ఎల్లప్పుడు నుండే సత్యము అన్నిటిని తెలిసికొనుచున్న చైతన్యము, దుఃఖము లేని పరబ్రహ్మానంద స్వరూపమే నీవు.

## అభివృద్ధి చతుష్టయము

### 1. దేశాభివృద్ధియన నేమి ?

ప్రజలందరును అన్నము, వస్త్రము, గృహము, విద్య, ఆరోగ్యము, సోదర భావముగలవారై పరస్పరము

సహాయము చేసికొనుచు క్షేమముగా నుండుట దేశాభివృద్ధి యనబడును.

2. గ్రామాభివృద్ధియన నేమి :

గ్రామములో కలహములు లేకుండుట; రోడ్లు పరిశుభ్రముగా నుండుట; విద్యాశాలలు, ఆరోగ్యశాలలు నుండుట; ఐకమత్యముతో నుండుటయును; దైవకార్యములను జరుపుచుండుటయును గ్రామాభివృద్ధి యనబడును.

3. ఆశ్రమాభివృద్ధియన నేమి :

ఆశ్రమము పరిశుభ్రముగా నుండుట; నిశ్శబ్దముగా నుండుట; పూజలు, భజనలు, పారాయణలు, జపధ్యానములు, వేదాంతశాస్త్ర శ్రవణ విచారణలు జరుగుచుండుట; ఒకరికొకరు సహాయభూతులుగా నుండుటయు ఆశ్రమాభివృద్ధి యనబడును.

4. జీవితాభివృద్ధియన నేమి?

శ్రీ సద్గురువుపైని, దేవునిపైని వేదాంత శాస్త్రముల పైని పూర్ణవిశ్వాసము నిలచుట; ధనముపైని,

భోగములపైని కీర్తిపైని విరక్తి గలుగుట; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు నశించుట ; శ్రవణ మనన నిధి ధ్యానములపై దృష్టి నిలచుట , నిర్వికల్పసమాధి సిద్ధించుట; సర్వాత్మ భావన సర్వదా యుండుటయును జీవితాభివృద్ధి యనబడును.

"తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు
విశ్వదాభిరామ వినుర వేమ."

## లక్ష్మి పార్వతిని హేళన చేయుట

## పార్వతి లక్ష్మిని హేళన చేయుట

1) లక్ష్మి : (పార్వతి దగ్గరకు వచ్చి) గౌరీ! నీ శంభునకు కంఠమున నలుపేమిటే ?

పార్వతి : నారీమణీ! నీ విష్ణుదేవుడు నలుపుగాదటే!

2) లక్ష్మి : గౌరీ ! బిరుదు లేక నీ కాంతుడు జగములో భిక్షమెత్తుటేమమ్మా !

పార్వతి : బలములేక నీ మగడు బలిచక్రవర్తిని మూడడుగులు యాచించుటేలమ్మా?

3) లక్ష్మి : శంకలేక శంకరుని చేతిలో జింక యుందు టేమమ్మా?

పార్వ : శంకలేక నీ నాథుడు వనవాసమందు జింకకొర కేగు టేమమ్మా?

4) లక్ష్మి : గౌరీ! నీ మగడు సర్పములను ధరించి నాడేమమ్మా?

పార్వ : నీ భర్త పాముపై పరుండు టేలమ్మా?

5) లక్ష్మి గౌరీ! నీ భర్త శ్మశానములో తిను టేమమ్మా?

పార్వ : నీ మగడు కుచేలు డిచ్చిన అటుకులు తిను టేలమ్మా?

6) లక్ష్మి : నీ మగడు ఎద్దు నెక్కినా డేమమ్మా?

పార్వ : నీ నాథుడు గోవులను, ఎద్దులను కాయు టేమమ్మా?

7) లక్ష్మి : గౌరీ! నీ మగడు మనుష్య పుఱ్ఱెను ఆహారపాత్రగా జేసికొనినా డేమమ్మా?

పార్వ : నీ భర్త బహుయజ్ఞశాలియై యుండె గదమ్మా!

అప్పుడు లక్ష్మి వెంటనే తలవంచుకొని సిగ్గుతో వెళ్ళెను.

## జ్ఞాని — అజ్ఞాని

## (శ్రీ చిన్మయ రామదాసుగారు - పెద్దాశ్రమం)

అజ్ఞాని దృశ్యవస్తువుల సంపాదనయందు మగ్నుడై యుండును.

జ్ఞాని దైవసంపాదనయందు నిమగ్నుడై యుండును.

అజ్ఞాని కామబుద్ధి గలిగి యుండును.

జ్ఞాని నిష్కామబుద్ధి గలిగి యుండును.

అజ్ఞాని మాటలలో కాలము గడుపును.

జ్ఞాని మౌనముగా నుండి ధ్యానములో కాలము గడుపును.

అజ్ఞాని దేహదృష్టి కలిగి యుండును.

జ్ఞాని ఆత్మదృష్టి గలిగి యుండును.

అజ్ఞాని లోభగుణము కలిగి యుండును.
జ్ఞాని త్యాగబుద్ధి కలిగి యుండును.

అజ్ఞాని మమకారము కలిగి యుండును.
జ్ఞాని నిర్మమత్వము కలిగి యుండును.

అజ్ఞాని పామరజన సంగములో కాలము గడుపును.
జ్ఞాని సాధుజన సాంగత్యమున కాలము గడుపును.

అజ్ఞాని శృంగార గ్రంథములు చదువు చుండును.
జ్ఞాని ఉపనిషద్భగవద్గీతాది గ్రంథములు
పరిశీలించుచుండును.

అజ్ఞాని మనశ్చాంచల్యము కలిగి యుండును.
జ్ఞాని నిశ్చల మనస్సు గలిగి నిర్వికల్పనిష్ఠలో
యుండును.

అజ్ఞాని కపటవర్తన గలిగి యుండును.
జ్ఞాని నిష్కపటముగ వ్యవహరించును.

## సోమరితన మన నేమి?

ప్రశ్న : సాధారణముగ జనులు పని పాటలు లేక యున్నవారిని చూచి 'వీరు సోమరులు' అని చెప్పు చుందురు.

"నహి కశ్చిత్ క్షణ మపి
జాతు తిష్ఠత్య కర్మకృత్ ।" గీత. అ. 3 శ్లో. 5

"క్షణకాలము కూడ పనిచేయక ఎవ్వరును ఉండరు, వుండలేరు" అని గీత చెప్పుచున్నది. ఇక లోకములో సోమరు లెవరు కలరు? మీ మళయాళ స్వాములవారు చెప్పినట్టి సోమరులకు చోటులేదు అను వాక్యమునకు తాత్పర్య మేమి?

సమా : సోమరులు సోహంపుత్వము నొందజాల రని నా శ్రీ మలయాళ సద్గురువు చెప్పెను.

సంసార ధర్మములను గాని, సన్న్యాసి ధర్మము లను విడిచియుండువారు సోమరులు.

శరీరము, వాక్కు, మనస్సులను పరిశుద్ధము చేయు కర్మలను చేయనివారు సోమరులు.

వ్యర్థములైన పనులతోను, మాటలతోను, చింతలతోను కాలమును గడుపువారు సోమరు లనబడుదురు.

పరమాత్మనుండి ఏర్పడియు మరల పరమాత్మను పొందుటకు పాటుపడనివారు సోమరులు.

పాపమునకు, అజ్ఞానమునకు భయపడక, పుణ్యముపై, ఆత్మజ్ఞానముపై భక్తి నుంచక యుండువారు సోమరులు.

నీతిని, ధర్మమును, భక్తిని, వైరాగ్యమును, మనోనిగ్రహమును, పరమాత్మ నిష్ఠను అభివృద్ధి పరచుకొనక యుండువారు సోమరులు.

కూర్చొనినపుడు, నడచునపుడు, పనులను చేయుచుండునపుడు, భుజించునపుడు, మలమూత్రములను విడచునపుడు, స్నానము చేయుచుండునపుడు, దానము చేయునపుడు, సేవ చేయుచుండునపుడు, నిద్రలోనికిపోవుచుండు నపుడును, దైవచింతనగాని,

ఆత్మచింతనగాని, వైరాగ్యచింతనగాని, ధర్మచింతన గాని, నీతిచింతనగాని చేయక యుండువారు సోమరులు.

శరీరమునకు శక్తియు, తీరికయు నున్నప్పటికి సత్కర్మలు చేయకుండుట శారీరక సోమరితన మన బడును.

పారాయణ, ప్రార్థనలు జేయకుండుట వాచిక సోమరితన మగును.

జపము, పరమాత్మ ధ్యానము, వేదాంత శాస్త్ర జ్ఞాన ధర్మచింతనలు చేయకుండుట మానసిక సోమరితన మగును.

శరీరము పూజ, సేవ, దానము మున్నగు సత్కర్మలు చేయుచుండునపుడు వాక్కు కఠినముగ అనవసరముగ మాట్లాడక సహాయముగ నుండవలెను. ఇట్లే మనస్సును సద్గుణములతో, దైవచింతనతో సహాయముగ నుండ వలెను.

వాక్కు పారాయణ, ప్రార్థన, ధర్మసంభాషణలు చేయుచుండునపుడు శరీరము నిశ్చలముగా నుండి

సహాయముగ నుండవలెను. మనస్సున్ను ఏకాగ్రతతో, దైవభావనతో సహాయముగ నుండవలెను.

మనస్సుతో మంత్రజపము, శ్రవణజ్ఞాన ధర్మ మననము, పరమాత్మ ధ్యానమును చేయుచుండునపుడు శరీరము కదలక, వాక్కు మాట్లాడక సహాయము చేయుచుండవలెను. ఒక కరణము చేయు సత్కర్మకు తక్కిన రెండు కరణములున్ను సహాయము చేయకుండుట సోమరితనమగును

"శరీర యాత్రాపి చతే
నప్రసిద్ధ్యేవకర్మణః" గీత. అ. 3 శ్లో 8

ధర్మకర్మలు చేయని సోమరులకు శరీరపోషణకు కావలసినవికూడ లభించవు.

సంసారులలోను, సాధుసన్న్యాసులలోను గల సోమరులు ఇహసుఖము, పరసుఖము నొందక చెడిపోవు చున్నారుగదా!

శ్లో. "సువర్ణ పుష్పాం పృథ్వీం
చిన్వంతి పురుషాస్త్రయః
శూరశ్చ కృత విద్యశ్చ
యశ్చ జానాతి సేవితుమ్."

తా. ఈ లోకములో ముగ్గురు బంగారు పుష్పాలను గ్రహించు (తీసికొను) చున్నారు.

1) శూరుడు 2) విద్యావంతుడు 3) సేవా పరాయణుడు.

శూరులు లేనిచో ఉత్తములు సంరక్షింపబడరు. విద్యావంతులు లేనిచో నీతి ధర్మ జ్ఞానములు క్షీణించి పోవును. సేవాపరాయణులు లేనిచో దుఃఖపడువారు అధికమగుచుందురు.

ఈ శ్లోకము సోమరులవలన ఇహపరసుఖములు దూరములగునను విషయమును స్పష్టము చేయుచున్నది.

ఫలమేమి ?

సీ. చదివిన ఫలమేమి – సన్మార్గవంతుడై
జనులకు సద్బోధ – సలుపవలయు
ధనమున్న ఫలమేమి – దాతృత్వ మూర్తియై
సత్కార్యం సిద్ధి – జరుపవలయు

భక్తుడై ఫలమేమి - పరమేశనామ సం
స్మరణంబులో - మది కరుగ వలయు
జ్ఞానియై ఫలమేమి - ఘనయోగ సంప్రాప్తి
నమనస్క భావంబు - నందవలయు

గీ. మనుజుడై పుట్టి ఫలమేమి మహిని తన్ను
దా నెరింగెడు తత్వంబు తలచవలయు
కలుషదూర! వ్యాసాశ్రమస్థలవిహార!
పరమ కారుణ్య! మలయాళ గురువరేణ్య.

పుణ్య కర్మ ఫలితములు

సీ. శాంత శమ దమంబు సత్యంబు సుగుణంబు
సిరియు సంపద మంచి శివుని భక్తి
నిర్భయము ఆనంద నిపుణత నిష్కపట
నీమంబు వ్రతములు నిత్యమానంద
భూతదయా జ్ఞాన పుణ్య దానంబులు
భేద రహితము చాల బీదరక్ష
దేహసౌందర్యంబు తెంపును ధైర్యంబు
పుణ్యకర్మకు ఫలము బుడమి నిదియె

తే. అరరె! ఈ కపట నాటకం బరసి చూడ
పరగ జన్మంబు నొక్కటే ఫలిత మేరు
అనెడి వాక్యంబు రీతిని అరయు మనగ
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను.

## పాపకర్మ ఫలితములు

సీ. గుడ్డి మూగియు కుంటి గుజ్జారితనమును
చెముడు నడ్డియు గూను చిత్తితలలు
యెచ్చి పిచ్చియు వెఱ్ఱి యెతిమత పైత్యము
గొంద్రాలు నత్తియు గుబలకమ్మ
మందమతి మూఢత్వ మరుపు నంగియు రంకు
కొఱ్ఱి మొర్రియు బొల్లి దొంగతనము
కఠినము దుర్మార్గ కపటంబు లీవి గల్గు
పాపకర్మకు లభ్య ఫలిత మిదియు

తే. అరరె! ఈ కపట నాటకం బరసి చూడ
పరగ జన్మంబు నొక్కటే ఫలిత మేరు
అనెడి వాక్యంబు రీతిని అరయు మనగ
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను.

## దేవు డెపుడు కనబడును?

సీ. సకలేంద్రియంబుల సందడి దీరిన
కాలంబునను దోచు కాలమూర్తి
త్రిగుణంబులను గూడ స్థిమితమొందిన వేళ
గుర్తింప ననువైన గుణవిరహితు
వృత్తుల యలజడి రిత్తవోయిన తరి
సత్యమై కనుపట్టు సత్యమూర్తి
భూతపంచకమును బొలిసిపోయిన యుస్థి
దొక్కడై కనుపట్టు నురు శరీరు

గీ. వ్యక్తమంతయు నవ్యక్తమైన యపుడు
దృశ్యమెల్ల నదృశ్యమై తెగిన యపుడు
నిత్యమై నిర్మలంబునై నిరయవము
నగుచు వెలుగొందు దేవు నాశ్రయించు!

## పాప భీతి యుండవలెను

సీ. పరలోకమందున బాధలేకను యున్న
అమ్మునా హరిశ్చంద్రు డాలి సుతుని
పరలోకమందున బాధలేకను యున్న
పోదురా పాండవుల్ పురము విడిచి

పరలోకమందున బాధలేకను యున్న
శిబి మేని కండలు చెండబోడు
పరలోకమందున బాధలేకను యున్న
కొలుచునా ఋతుపర్ణ కొలువు నలుడు

తే. మనసుసాక్షికి మీరిన మార్గమెల్ల
శాస్త్రపద్ధతి మీరిన చలనమెల్ల
నరకమోరన్న నరకంబు నరక మనఘ
ఆత్మనమ్మితి నారాయణార్య నిన్ను

మాయను నమ్మరాదు, మాయను తెలిసికొనుచున్న

చైతన్యమే దైవస్వరూపము

సీ. సూర్యచంద్రులు మాయ, సృష్టిసర్వము మాయ
ధనధాన్యములు మాయ, తనువు మాయ
అఖిలకర్మలు మాయ యవనీశ్వరులు మాయ
ఉద్యోగములు మాయ, విద్య మాయ
తల్లిదండ్రులు మాయ, తగులాటములు మాయ
పనులన్నియును మాయ, ఫలము మాయ
సర్వజీవులు మాయ, సంసార మతి మాయ
సతి సుఖంబులు మాయ గతులు మాయ

గీ. దృశ్య కార్యంబు లన్నియు దుఃఖమగుచు
మాయగా బోవు సంగతి మరచిపోవు
మానవుల జన్మ మతి మాయ మాయ
రాజయోగీంద్ర! లక్ష్మినారాయణార్య!
మాయచేయు మోసములు తెలుసికొనుము

సీ. ఉన్నది లేదని, యూహింపగా నేర్చు
లేనిది కలదని, లెస్స నేర్చు
అజడంబు జడమని, యాగడింపగ నేర్చు
జడ మజడంబని, చాట నేర్చు
సుఖము దుఃఖంబుగా, జూపి చెప్పగ నేర్చు
దుఃఖంబు సుఖమన, దొలుత నేర్చు
నిది నిది గాదని, యింపుగా నన నేర్చు
నది యిది గాదని, యనగ నేర్చు

తే. బిదప గలదియు గలదు లేనిదియు లేదు
కడగి యజడంబె యజడము జడమె జడము
సుఖమె సుఖము తలంప నసుఖమె యసుఖ
మదియె యిది యిది యని యాడ నేర్చు!

## మానవుల దుర్బలత్వ మేమన వచ్చును ?

సీ. సంసారమున జేరి - చావజూతురుగాని
లక్ష్య ముంచరు - మహాలాభమునకు
పిచ్చిపట్టినరీతి - కుత్సికేద్దురుగాని
లక్ష్య ముంచరు - మహాలాభమునకు
పలుదుఃఖముల కోర్చి - కలుకుచుందురుగాని
లక్ష్య ముంచరు - మహాలాభమునకు
తెగతిని మత్తెక్కి - పొగరుగాంతురుగాని
లక్ష్య ముంచరు - మహాలాభమునకు

గీ. నిట్టి పలుగాకి మనుజు లీ సృష్టియందు
హీనకర్మలు గుర్తించి మానలేక
చెరుపుచున్నారు యోగముల్ జరుగనీక
రాజయోగీంద్ర ! లక్ష్మీనారాయణార్య !

## కన్నుమూయువరకే భ్రాంతులు నిజమగును

సీ. తల్లిదండ్రులు నక్క - చెల్లెండ్రు బావలు
నన్నదమ్ములు - మోదమందు చెల్ల
నాలు బిడ్డలు సొంత - యత్తమామలు సదా
యసమానురాగులై - మసలు చెల్ల

నఖిల విద్యలు మంచి సఖులు బంధు శ్రేణి
పశుధనంబులు - గొప్పవసతులెల్ల
జగతిపై స్థావర జంగమాదుల తోడ
నిండి కన్పించు బ్రహ్మాండమెల్ల

గీ. కన్ను మూసిన తోడనే సున్న యగుచు
మాయమైపోవు సంగతి మరచి సర్వ
పాపములు చేయుచుందు రీ పాడు నరులు
రాజయోగీంద్ర! లక్ష్మీనారాయణార్య॥

## నేను, నాది యనునది నీవు నీది యగును

సీ. మొదట సంసారంబు, మోసి యేడ్చిన కుంత
తనయునిపై బెట్టి, తన్లిపోయె
దాని నాతడు మోసి మానక మరికొంత
కూర్చి పుత్రున కిచ్చి, కూలిపోయె
నద్దాని ధరియించి, హద్దుగానక మోసి
యతని పుత్రున కిచ్చి, యడగిపోయె
నట్టి దానిని నాత డెట్టులో తెగమోసి
సతి సుతాదుల కిచ్చి, సమసిపోయె

సీ. బహుతరంబుల నుండి యీ బాధ బొందు
  చెరిగి మానవు లీ మాయ గురి ధరించి
కూలుచున్నారు పరమాత్మ గుర్తు దప్పి
  రాజయోగీంద్ర! లక్ష్మీనారాయణార్య!

—తత్త్వలక్ష్యార్ణవము

## నిజాచరణయే మోక్షమిచ్చును

సీ. జందె మింపుగ వేసి, సంధ్యవార్చిన నేమి
  బ్రహ్మమందక కాదు, బ్రాహ్మణుండు
తిరుమణిశ్రీచూర్ణ, గురురేఖ లిడినను
  విష్ణునొందక కాదు, వైష్ణవుండు
బూదిని నుదుటను, బూసికొనిన నేమి
  శంభు నొందక కాదు, శైవజనుడు
కాషాయవస్త్రాలు కట్టి, కప్పిన నేమి
  యాశపోవక కాదు, యతివరుండు
తే. ఇట్టి లౌకిక వేషాలు గిట్టుకొనిన
  గురుని జెందక సన్ముక్తి దొరకబోదు
భూషణవికాస శ్రీధర్మ పురనివాస
  దుష్టసంహార నరసింహ దురితదూర॥

—నరసింహ శతకము

# మాయా మనోవాంఛలుగలవారు దైవామృతమును అనుభవించలేరు

సీ. కామహర్షాది సంకలితమై చిత్తంబు
భవదీయ చింతన పదవి సొరదు
మధురాది రసముల మరగి చొక్కుచు జిహ్వా
సీ వర్ణనమునకు నిగుడ నీదు
సుందరీ ముఖముల జూడగోరుచు జూడ్కి
తావకాకృతులపై తగులు వడదు
వివిధ దుర్భాషలు వినగోరు వీనులు
వినవు యుష్మత్కథా విరచనములు

తే. ఘ్రాణ మురవడి దిరుగు దుర్గంధములకు
దవులు గొలుపదు వైష్ణవ ధర్మములకు
నడగి యుండవు కర్మేంద్రియములు పురుష
గలచు సవతులు గృహమేధి గలచునట్లు ॥

—భాగవతము

## సంసారము ఎవరికి సముద్రము వంటిదో చెప్పెద వినుము

సీ. ఆలుబిడ్డలు తనకు, అణగియుండకయున్న
సంసారమది గొప్ప సాగరంబు
అన్నదమ్ములు తనకు, అణగియుండకయున్న
సంసారమది గొప్ప సాగరంబు
సిరిసంపదలు బోయి, చిక్కు లొచ్చినతోడ
సంసారమది గొప్ప సాగరంబు
బీదతనమున భాగ్య, పేరాస గలిగిన
సంసారమది గొప్ప సాగరంబు
తే. సప్తజలధుల నీదియు సైపవచ్చు
యిట్టి సంసార మొక ఘుంట యీదరాదు
ధరను యీ కష్టమును దీర్ప దైవ మనగ
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను॥

## దేవునిపై ఎవరి దృష్టి నిలువదో చెప్పెద వినుము

సీ. స రి గ మ ల్ పాడుచు సంచలించెడి మది
నిశ్చలంబుగ దేవు, నెరుగబోదు
ఇరు పొరుగుల పోరు విని సంభ్రమపడు మది
నిశ్చలంబుగ దేవు, నెరుగబోదు

తనకు మించిన పనికి, త్వరపడు నా మది
నిశ్చలంబుగ దేవు, నెఱుగబోదు
కష్టమొచ్చెడి వేళ, కలత జెందెడి మది
నిశ్చలంబుగ దేవు, నెరుగబోదు

తే. నిష్ఠ గలిగియు నీ యందు నిలుచు మనసు
నిట్టి విషయంబు లన్నియు విడిచిపెట్టి
ఏకదృష్టిని మనసుకు యెరుగజేయ
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను

—నారాయణార్య శతకము

భారతదేశ మహాభాగ్యము దేవుని
అవతారములే యగును

సీ. వేదాల కందని యా దేవుడే తాను
చల్లముంతల కిట సాధ్యపడియె
ఋషుల కైంకర్యాల కెవ్వాడందడో వాడె
వెన్నముద్దల కిట వివశుడయ్యె

బొజ్జలో బదునాల్గు భువనాల నిల్పిన
మాధవు డిచ్చట మన్ను మెసవె
హరిహరబ్రహ్మల కంద జాలనివాడె
కృప నిట జెలుల యెంగిల్లు తినియె
గీ. దన్ను కీర్తించు సామవేదమ్ము వదలి
వేణు విట దానె ప్రయోగించె విమలధ్వనితి
నితర లోకాలు దేశాలు నీర్ష్య పడగ
నలరు భరతఖండమున గోకులము భళిర ॥

—దేవరకొండ సనత్కుమారశర్మగారు
హిందీ ప్రచారక్, మచిలీపట్టణము

## ఆచరణ—అనుభవము

## సన్న్యాసాశ్రమ శ్రేష్ఠత్వము

సీ. "ఈ జగత్రయమేలు నిందునకైన స
న్న్యాసికున్నంత సౌఖ్యమ్ము లేదు
సాక్షాన్మహాలక్ష్మి వక్షమందున్న వి
ష్ణునకైన యతికున్న సుఖము లేదు

త్రిజగత్కుటుంబియౌ నజునికైనను విర
క్తుల కున్నయంత నిశ్చలత లేదు
అణిమాదియుక్తుడౌ హరునికైనను గోచి
పాతరాయనికున్న భాతి లేదు

గీ. తపములకు విఘ్నము లొనర్పదలచుటయును
దైత్యుల హరింప దలచి ఖేదంబు గొనుట
యును గదా వీర లొనరించు పనులు నే న
టెంగియును సంగమున బడి క్రుంగనేల ?"

అని శ్రీ శుకులు వ్యాసులకు చెప్పను.

## గృహస్థాశ్రమ శ్రేష్ఠత్వము

సీ. "వేదవ్రతముల నాపాదించి చరించు
బ్రహ్మచారులకెల్ల బట్టుగొమ్మ
అతిథులై యేతెంచునట్టి గృహస్థుల
నాదరింపంగ గల్పాగమింబు

ఛా ర్యైకయుక్తులై వనమున దిరుగు వా
నప్రస్థులకు రతిణాప్రసక్తి
సంసార పింంసారిరంసా విరక్తులా
సన్న్యాసులకును విశ్రాంతి భూమి

యైన గార్హస్థ్యమున నుండి యఖిల ధర్మ
ముల నొనర్చి తుదకు ముక్తి బొందవచ్చు
నట్లు గాకేని యవసిష్ఠాది మునుల
కేల గార్హస్థ్యమున నుండు టెరుగ జెపుము"
వ్యాసులు శుకునకు చెప్పెను.

## గురువు లక్షణములు

( నారాయణార్య శతకము నుండి )

సీ. ధనధాన్యముల మది దగిలకుండినగదా
గురువుల మేమంచు కులుకుటకును
అవని కనకము వెండి కాశ విడచినగదా
గురువుల మేమంచు కులుకుటకును

పాలు వీరనునట్టి వైర మడచినగదా
గురువుల మేమంచు తలుకుటకును
జింహ గుహ్యము రెంటి చెదరకుండినగదా
గురువుల మేమంచు తలుకుటకును

తే. గీ. ఇదియె అజ్ఞానమనునట్టి గేను మాడు
జీవుడనుపేరు దీనికే చెలగుచుండు
వీటి విడిపించ దేవుడై వెలయు ననఘ
ఆత్మ నమ్మిరి నారాయణాత్మ సిద్ధు.

సీ. కోడిపెట్టతో సమము గురువుల నెంచుడి
కోడిపిల్లలు శిష్యకోటు లెంచు
వేదవాక్యము లనెడి వెరుకు డబ్బులు త్రవ్వి
తమ పిల్లలకు నిచ్చు తత్త్వబోధ
అజ్ఞానమను గద్ద యటు దూరమున జూచి
భద్రమని పిల్లలకు భయము దీర్చు
వ్రాయమొచ్చిన తోడ పారద్రోలును గాని
పిల్లి గద్దకు మధ్య పెట్టబోదు

తే. గీ. మంచి హితగురువు శిష్యుల మహిని గాంచి
కలిగి స్వతబుద్ధి పరమును గాంచువరకు
విడడు సద్గురువు నీ వెరుగు మనగ
ఆత్మనమ్మితి నారాయణార్య నిన్ను.

సీ. పరకాంత గినినంత భ్రమిసి చూచెడి మది
గురుపాదములు నమ్మి కుదురబోదు
సత్యంబు చెప్పను సంకోచపడు మది
గురుపాదములు నమ్మి కుదురబోదు
అన్నదమ్ములటంచు అపేక్షపడు మది
గురుపాదములు నమ్మి కుదురబోదు
పరులను దూషించు పనికిమాలిన మది
గురుపాదములు నమ్మి కుదురబోదు

తే. గీ. జీవరాశిని సమముగా భావమెంచు
మనస్సు తప్పక బ్రహ్మంబు మార్గ మరయు
ఇతర మార్గంబు లన్నియు యెక్కువనగ
ఆత్మనమ్మితి నారాయణార్య నిన్ను.

# అచలమతానుభవములు

సీ. అతిథి వాకిట జేరి, అరచి భిక్షము వేడ
ఆదరించుటగాదె అచల పదవి
కొట్టి తిట్టియు తన్ను కోపించువానిని
ఆదరించుటగాదె అచల పదవి
తన శత్రువులనెల్ల తనకు మిత్రు లటంచు
ఆదరించుటగాదె అచల పదవి
నొప్పించ కొఱులను నొవ్వకుండగ తాను
ఆదరించుటగాదె అచల పదవి

తే. గీ. ఇట్టి సద్గురు దరిజేర యిడును కర్మ
అట్టి గురువులు దొరకుట యరుదు దలంగ
నీకు అన్యము నితరుల నెరుగ లేక
ఆత్మ నమ్మితి నారాయణార్య నిన్ను.

" సర్వం వ్యర్థం మరణ సమయే రామ ఏక
స్పృహోయమ్. "

చ. ప్రబలి కఫంబు కంఠమున బాధలు పెట్టెడివేళ
జ్ఞాపరుల్
గబగబ బైట పెట్టు డిక కార్యము లేదనువేళ
కింకరుల్
దబదబ ప్రాణవాయువులు లాగెడువేళల నాలు
చుట్టముల్
లబ ౘ బలాడు వేళల దలంపగ శక్యమె
రామనామమున్.

సీ. దంతంబు లూడు నన్ చింత పుట్టకమున్న
కనుదోయి మసకలు గొనకమున్న
ముదుఃతలచే మేను ముడుతలు లాడకమున్న
వడకున గాల్ దడబడకమున్న
పెండ్లము కడు కడగండ్లు పెట్టకమున్న
నందనుల్ తను చూచి నగకమున్న
గద్దించి బుదుతలు బుద్ధిచెప్పకమున్న
రుదురోగముల తెల్వి చెడకమున్న

తే. గీ. ప్రాణి వైద్యుడు చెప్పకపోకమున్న
కాలభట దర్శనంబును గాకమున్న
'రామ శ్రీరామ శ్రీరామ' యనుచు
ధ్యాన మొనరించువాడెపో ధన్యతముడు.

—శ్రీ వాసుదాసస్వామి

సీ. పడుచుదనం బెల్ల భగ్నమై దేహంబు
ముడుతలై ముడుతలై మొనయువేళ
కఫ వాత పిత్తాదికము లధికములై
ఎంతయు తను చలాయించువేళ
అమృతోపమానమం చనుకొను తనభార్య
తను చేర శంకించుకొనెడువేళ
బంధుజనము నాల్గుప్రక్కలనుండి స్వ
లాభము లెల్ల తలంచువేళ

తే. గీ. క్షణములో ప్రాణ మిక దిగజారువేళ
రాముడే రఘురాముడే రక్షకుండు
చూడగా బోవ రాస్తి పంచుకొనువారు
రక్షకులు గారు రాముడే రక్షకుండు.

—భక్త త్యాగరాజు

సీ. ఆశాపిశాచి కావేశంబు గల్గిన
మంత్రి సామర్థ్యంబు మట్టిపాలు
దారిద్ర్యమను దావదహనంబు దరికొన్న
బుద్ధిబలంబెల్ల బూదిపాలు
సంసారవిషయంబు చాల గల్గిన
ధర్మకర్మంబులు ధరణిపాలు
కామినీ జిజ్ఞాస కడు దుస్సహంబైన
గురుదేవతా భక్తి గుట్టపాలు

తే. గీ. ఇట్టి విషయంబు లాత్మలో నెట్టికొనిన
నెట్టి విద్వాంసుడైనను గట్టుగనునె
శ్రీమనోనాథ! మాధవ! శ్రీయనంత!
పద్మనాభ! దయానిధే! పరమపురుషా!

క. మా ఇల్లని మా పొలమని
కాయము తన సొమ్మటంచు గామాతురుడై
మాయని పదవిని గోరక
దాయాదులపాలు చేయదగదుర వేమా!

ఆ. భూమి నాది యనిన భూమి పక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు
దనభీతుఁ జూచి కాలుడు నవ్వును
విశ్వదాభిరామ వినుర వేమ.

క. అతి నిద్రావంతున కు
న్నతిపానికి నిరశునకు నతికోపునకున్
ధృతిహీనున కపకృతునకు
జతపడ దీ బ్రహ్మవిద్య చాటర వేమా!

ఆ. కాగల పను లెల్ల కాకెక్కిపోవును
కాని పనులు భువిని కానె కావు
మహిమ వేరెయుండ మనతోడనున్నదా
విశ్వదాభిరామ వినుర వేమ.

ఓమ్

"బృందావన మనమందరిదీ గోవిందుడు అందరివాడలే" అనుమాదిరి

1) జగమంతా మనమందరిదీ
జగదీశుడు యందరివాడే లే
కామ క్రోధ మద మోహము లుడిగిన
కనబడు నిజమని తెలియునులే!

2) పరమాత్మను ప్రార్థించిన వారికి
పాపదోషము లేక నుండవు లే
పాడు దేహమును నమ్మిన వారికి
పరమ పదంబిక దొరుకదు లే ॥

3) అందరిలో సకలాంతరాత్ముడు
అహముతో నిత్యము నుండెను లే
నీవు నేనను భేదము లుడిగిన
నీవే నేనై యుందును లే ॥

4) బాధలలో భగవంతుని దలచిన
భక్తులు భోగము లిడుచును లే
బాధ భోగములేని స్వరూపము
భగవంతుడే యని తెలియును లే ॥

5) 'శివ శివ శంకర ! శ్రీరఘురామా !
శ్రీకృష్ణా ! హరీ !' యందును లే
చిన్మయరామదాసుని నిత్యము
చింతన జేర్చుచు బ్రోచును లే ॥

ఓమ్

# కీర్తనలు

1) రావోయి వేంకటేశా!
నా బాధలన్ని వినుమా!

2) రోగములో బడి యుంటి
రాగము విడువక యుంటి
ద్వేషము జూపుచు నుంటి
దేవుని మరచుచు నుంటి॥

3) విద్యలు రాకను యుంటి
ఉద్యోగము లేకను యుంటి
అవిద్యను వీడక యుంటి
అజ్ఞానములో బడి యుంటి॥

4) గురువుల నమ్మక యుంటి
సత్తులో నిలువక యుంటి
గోప్యము తెలియక యుంటి
ప్రాప్యము దొరకక యుంటి॥

5) క్లేశము నొందుచు నుంటి నిను
కీర్తన చేయక నుంటి
కంటినీటితో నుంటి నను
కావు కావు మని యంటి॥

6) చిన్మయదాసుడ నంటి
చింతలు పోకను యుంటి
పాహి పాహి యని యుంటి
నా ప్రార్థన వినుమని యంటి.

తే. గీ. ప్రియమె దుఃఖంబు గల్గించు ప్రియమె వివిధ
శోక పరిదేవనంబుల కాకరంబు
అకని యెవనికి ప్రియ వస్తువనున దొకటి
లేదొ వానికి దుఃఖాలు లేనె లేవు.

—శ్రీ బుద్ధుడు

గుడ్డివా రెవరు?

శ్లో. సత్సంగశ్చ వివేకశ్చ
నిర్మలం నయన ద్వయమ్
యస్య నాస్తి నరస్సోంధః
కథమ్ న స్యాదమార్గగః ।

తా॥ ఎవరికి సజ్జనసాంగత్యము, వివేకజ్ఞానము (అనగా ధర్మాధర్మములను, నిత్యానిత్యములను, కర్తవ్యాకర్తవ్యములను తెలిసికొని ప్రవర్తించెడి తెలివి) అను నిర్మలములైన నేత్రములు లేనివారే అంధులు. వీరు తప్పుదారిని నడచి నశింతురుగదా! కనుక సత్సంగము, వివేకము అను రెండు నేత్రములు గలిగియుండి ఈ సంసారములో, లోకములో ప్రవర్తించుచుండవలెను.

## మానవుని ని[illegible]కము విచారము

శ్లో. కృతం పరిజనస్యార్థే
మయాకర్మ శుభాశుభమ్
ఏకాకీ తేన దగ్ధోఽహమ్
గతాస్తే ఫలభోగినః॥

తా. ఓ భగవంతుడా! భార్య పుత్ర మిత్రాదుల పోషణాదుల కొఱకై నేను అనేకములైన పుణ్య పాప కర్మలను చేసితిని. చివరికి నేను ఒక్కడనే మిగిలి యుండి నా కర్మఫలితములచే దహింపబడుచున్నాను. నేను ఎవరినిమిత్తము రాత్రిం బవల్లులు కష్టపడితినో వారందరును నెమ్మదిగా దాటిపోయిరి. ఆహా! నే నెంత మోసపోతిని?

0883 - 246 2565
903 246 2565

MOHAN PUBLICATIONS

మోహన్ పబ్లికేషన్స్,

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం - 533101.

WWW.MOHANPUBLICATIONS.COM

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

